

Reg. No. M. 2057

సం॥ర చందా 6—0—0

శ్రీరస్తు

శ్రీమన్మార్తాండాయనమః

# జ్యోతిషచంద్రిక

మాసపత్రిక

సంపాదకుడు

ఆకెళ్ల వేంకటశాస్త్రి

గోపాలపురము



| | | |
|---|---|---|
| 1 వ సంపుటము | క్రోధన సం॥ర శ్రావణమాసము ఆగష్టునెల 1925 | 4 వ సంచిక |



విషయసూచిక

శ్రీరస్తు

# అథ ప్రశ్నతత్వారంభః

శ్లో॥ ఆలింగనాయసంవృత్తౌ భవాదేవౌ మిథోభియూ।
విశ్లేషస్యైకతాం యాతౌ భూయస్తాం మంగళాయనః॥
తత్రాదౌ భావానాం విచారః॥ మొదట భావముల విచారణ.

1 యోభావః స్వస్వామి శుభైర్యుక్తో దృష్టోవా తస్య
వృద్ధిః పాపైర్హానిః మిశ్రైర్మిశ్రం॥

యేభావము ఆభావాధిపతితోగాని శుభగ్రహములతోగాని కూడియుండినను శుభగ్రహములచే చూడబడుచున్నను ఆభావము మంచిఫలము నిచ్చును. పాపగ్రహములతో గూడినను చూడబడినను పాపఫలము నిచ్చును. శుభపాపమిశ్రమైయుండిన మిశ్రఫలము నిచ్చును.

2 నీచారిస్థో గ్రహో భావనాశకః॥

యేభావమందు నీచశత్రుక్షేత్రములను పొందిన గ్రహముండునో ఆభావఫలము నియ్యనేరదు.

3 స్వసుహృత్తుంగస్థో భావవృద్ధికరః॥

యేభావమందుండు గ్రహము స్వక్షేత్ర మిత్రక్షేత్ర ఉచ్ఛస్థానములను పొందియుండునో ఆభావఫలము విశేషముగా నిచ్చును.

4 యద్భావా త్త్రిగపాపా స్తద్భావనాశః॥

యేభావమునకు 6-12 స్థానములయందు పాపగ్రహములుండునో ఆ భావఫలము శూన్యము.

5 యద్భావేశస్త్రికే త్రికేశో వా యద్భావే తద్భావనాశః॥

యేభావాధిపతి 6-12 స్థానములందుండునో 6-12 స్థానాధిపతులు యేభావమందుండునో ఆభావములు మంచిఫలము నియ్యవు

6 యద్భావీయ కేంద్రత్రికోణస్థానాని శుభపతియుతాని తద్భావ
పుష్టిః పాపయుతానిచే ద్ధాని ర్మిశ్రయుతాని మిశ్రం॥

యేభావమునకు, కేంద్ర, ధన, కోణస్థానములు శుభగ్రహములతో కూడియున్నయెడల ఆభావము బలమైయుండును. పాపగ్రహములతో కూడియున్నయెడల హానిచేయును. శుభ పాపగ్రహములతో కలసియున్న యెడల మిశ్రఫలము నిచ్చును.

7 యద్భావేశోరినీచగ శ్శుభై రయుతే ఈక్షితశ్చే త్తద్భావనాశః॥

యేభావాధిపతి శత్రు నీచస్థానములను పొంది శుభగ్రహములతో కూడియుండక గాని చూడబడక గాని వున్నయెడల ఆభావఫలము శూన్యమైయుండును.

8 యద్యద్భావీయ రంధ్రేశ సూర్య, శని, గుళికేశ, గుళికాంశే
శానాం మధ్యే యోధికబలో తత్పాకే మూర్తివిత్తాది నాశః॥

యేయే భావములయందుండిన అష్టమాధిపతి, రవి, శని, గుళికాధిపతి, గుళికాంశాధిపతులలో యెవరు అధికబలవంతులో వారు వారిదశాభుక్తులయందు ప్రాణసంశయము, ధననాశమును చేయును.

9 అథాంగవిచారః. స్వాంశేంగేశే శుభయుతేవా
శుభదృష్టే దేహసౌఖ్యం॥

లగ్నాధిపతి స్వకీయాంశయందుండి శుభగ్రహములతో కూడిగాని చూడబడిగాని వున్నయెడల దేహసౌఖ్యము గలుగును.

10 అంగేశేంగే దేహసౌఖ్యం॥

లగ్నాధిపతి లగ్నమందుండిన దేహసౌఖ్యము గలుగును.

11 సపాపేంగేశే త్రికే దేహసౌఖ్యంన॥

లగ్నాధిపతి పాపులతో గూడి 6-12 స్థానములందుండిన దేహసౌఖ్యము లేదు.

12 లగ్నేపాపా లగ్నేశేచ హీనవీర్యే దేహసౌఖ్యంన॥

లగ్నమందు పాపగ్రహములుండి లగ్నాధిపతి బలహీనుడైన దేహసౌఖ్యములేదు.

13 శనిచంద్రా మేషే దేహకార్శ్యం॥

మేషమందు శనిచంద్రు లుండిన దేహము చిక్కియుండును.

14 అంత్యేశే లాభకేంద్రగే వక్రే దేహకార్శ్యం॥

వ్యయాధిపతి కేంద్రలాభములందుండి వక్రించిన దేహము చిక్కియుండును.

15 లగ్నేశాధిష్టితభేశస్త్రికే దేహకార్శ్యం॥

లగ్నాధిపతియుండిన రాశ్యధిపతి 6-12 స్థానములందుండిన దేహము చిక్కియుండును.

16 శుష్కాంగే శుష్కగ్రహే దేహకార్శ్యం॥

లగ్నము శుష్కరాశియై శుష్కగ్రహములతో కూడియుండిన దేహకార్శ్యము.

17 శుష్కయుతేంగేశే దేహకార్శ్యం.

లగ్నాధిపతి శుష్కగ్రహములతో గూడియుండిన దేహము కృశించును.

18 శుష్కగ్రహక్షేత్రేంగేశే దేహకార్శ్యం.

లగ్నాధిపతి శుష్కగ్రహక్షేత్రమందుండిన దేహము కృశించును.

19 లగ్నేశాంశేశే శుష్కే దేహకార్శ్యం.

లగ్నాధిపతి యుండిన నవాంశాధిపతి శుష్కరాశియందుండిన దేహముకృశించును.

20 శుష్కాంగగపాపైః దేహకార్శ్యం.

పాపగ్రహములు శుష్కరాశియైన లగ్నమందుండిన దేహము కృశించును.

21 రాశీశే సాంగనాథే దేహపుష్టిః.

లగ్నాధిపతి చంద్రలగ్నాధిపతితో కూడియుండిన దేహపుష్టి గలుగును.

22 తోయక్షేత్రేంగేశే శుభాన్వితేవా జలఖగదృష్టే దేహపుష్టిః.

లగ్నాధిపతి జలరాశియందుండి శుభగ్రహములతో కూడిగాని జలగ్రహములచే చూడబడిగాని వుండిన దేహపుష్టిగలుగును.

23 శుభక్షేత్రేంగే జలక్షేత్రంగాంశేశే దేహపుష్టిః.

లగ్నము శుభక్షేత్రమై జలరాశియందు లగ్నాంశాధిపతియుండిన దేహపుష్టి గలుగును.

24 లగ్నే శుభక్షేత్రే పాపదృగ్వర్జితే దేహపుష్టిః.

లగ్నము శుభక్షేత్రమై పాపులచేత చూడబడనియెడల దేహపుష్టి గలుగును.

25 లగ్నే గురుయుతేవా గురుదృష్టే దేహపుష్టిః.

లగ్నమందు గురుండిగాని గురునిచే చూడబడిగాని వుండిన దేహపుష్టిగలుగును.

26 జలర్క్షాంగే శుభైర్యుతేవా దృష్టే దేహపుష్టిః.

లగ్నము జలరాశియై శుభగ్రహములతో కూడిగాని చూడబడిగాని వున్న దేహపుష్టిగలుగును.

27 మిధునాంశే దేహపుష్టిః.

లగ్నము మిధునాంశయందైనయెడల దేహపుష్టిగలుగును.

28 లగ్నగే సబలే సత్ఖచరే దేహపుష్టిః.

శుభగ్రహములు బలవంతములై లగ్నమందుండిన దేహపుష్టిగలుగును.

29 లగ్నాదిరాశయః శిరఃప్రభృతి కాలాంగేషు కల్ప్యాః.

లగ్నము మొదలు పండ్రెండు రాసులున్ను కాలపురుషునియొక్క శిరస్సు మొదలుకుని అంగములయందు కల్పనచేయవలెను.

30 యత్రాంగే దీర్ఘరాశిర్దీర్ఘభపశ్చ తద్దీర్ఘం
వ్యస్తే హ్రస్వం మిశ్రే మిశ్రం గ్రహానాక్రాంత
రాశిశ్చేద్రాశివత్.

లగ్నాధిపతియున్ను లగ్నమున్ను దీర్ఘములై యుండిన పొడవున్ను వ్యత్యయముగానుండిన పొట్టియున్ను మిశ్రముగానుండిన మిశ్రముగాను గ్రహములచే నాక్రమింపబడియుండిన రాశిని బట్టియు యోచించవలెను.

31 బుధాత్సప్తమే భౌమే దీర్ఘదేహః.

బుధునికి సప్తమస్థానమందు కుజుండిన దీర్ఘదేహము గల్గును.

32 లగ్నపే దీర్ఘభే దీర్ఘదేహః.

లగ్నాధిపతి దీర్ఘరాశియందుండిన దీర్ఘదేహము గలుగును.

33 మందాత్తుర్యే చంద్రే రాశ్యాద్యభాగేవా అల్ప
తరరాశ్యంత్యభాగే వామనః.

శనికి 12 ట చంద్రుడుండి ఆ రాశియొక్క మొదటిభాగమందైనను అల్పరాశియొక్క అంత్యభాగమందైన నుండిన పొట్టివాడగును.

34 లగ్నేశేఽల్పతరభే శుభే దృష్టిహీనే వామనః.

లగ్నాధిపతి అల్పరాశి అనగా తక్కువకాలముగల రాశియందుండి శుభగ్రహదృష్టి లేకయుండిన పొట్టివాడగును.

35 పృష్ఠోదయగే చంద్రే తుర్యే శనిదృష్టే చాజేంగేశే వామనః.

చంద్రుడు పృష్ఠోదయరాశియైన వ్యయస్థానమందుండి శనిచేత చూడబడుచుండి లగ్నాధిపతి మేషమందున్న యెడల వామనుడగును.

36 సింహేఽర్కాచ్ఛౌ ఖేమృగే చంద్రే వామనః.

సింహామందు రవిశుక్రులున్న దశమమయ్యి మకరమందు చంద్రుడుండిన వామనుడగును.

37 ఆద్యాంత్యేశే చంద్రమందదృష్టే సౌమ్యాదృష్టే వామనః.

లగ్నవ్యయాధిపతులు చంద్రశనులచేత చూడబడుచు శుభదృష్టి లేకుండిన వామనుడగును.

38 లగ్నేశేఽల్పర్క్షే లగ్నదర్శిని వామనః.

లగ్నాధిపతి అల్పరాశియందుండి లగ్నమును చూచుచుండిన పొట్టియగును.

39 కేంద్రస్థాః క్రూరాః వికలాంగః.

క్రూరగ్రహములు కేంద్రములయందుండిన వికలాంగుడగును.

40 కేంద్రగా పుష్పవంతౌ వికలాంగః.

సూర్యచంద్రులు కేంద్రములందుండిన వికలాంగుడగును.

41 లగ్నేశుక్రే మందదృష్టే శ్రోణిభాగే వైకల్యం.

లగ్నమందు శుక్రుడుండి శనిచేత చూడబడుచుండిన పిరుదులయందు వికలముగల్గును.

42 తుర్యేశుక్రే మందారజ్ఞాన్యతమయుతే జీవో
కరచరణకట్యాన్యతమే వైకల్యం.

శుక్రుడు వ్యయస్థానమందుండి గురుడు శని కుజ బుధులకు వేరయిన యితరగ్రహములతో గూడియుండిన కాళ్ళు చేతులు కటిప్రదేశములకు గాక యితరఅవయవములలో వికలము గలుగును.

43 చంద్రేఖే భౌమే స్తే మందే వేశిగే వికలాంగః.

చంద్రుడు 10 యందును కుజుడు 7 యందు శని సూర్యునకు 2 స్థానమందు చంద్రవర్జితుడై యుండిన వికలాంగుడగును.

44 సుతార్కే భౌమే క్రూరైర్దృష్టే హీనాంగః.

కుజుడు 5-9 స్థానములందుండి క్రూరగ్రహములచే చూడబడిన హీనాంగుడగును.

45 మందేర్థే ఖేచంద్రే జ్ఞేస్తే వికలాంగః.

శని 2 యందును చంద్రుడు 10 యందును బుధుడు 7 యందుండిన వికలాంగుడు.

46 నీచగా శ్శుక్రేందుమందాశ్చ కుంభేర్కే వికలాంగః.

శని, చంద్ర, శుక్రులు నీచనుపొంది రవి కుంభమందుండిన వికలాంగుడు.

47 నీచేభౌమే రక్తపిత్తకోపః.

కుజుడు నీచయందుండిన రక్తపయిత్య ప్రకోపము గలవాడగును.

48 మందర్క్షే శుక్రే దేహేదౌర్గంధ్యం.

శనిక్షేత్రమందు శుక్రుండిన దేహము దుర్గంధము గలిగియుండును.

49 షష్ఠ్యేశే జ్ఞర్క్షేవా నక్రే దేహే దౌర్గంధ్యం.

షష్టమాధిపతి బుధక్షేత్రమందైన మకరమందైన నుండిన దేహ దుర్గంధము.

50 జ్ఞక్షేత్రే శుక్రే జ్ఞయుతే కేంద్రే దేహే దౌర్గంధ్యం.

శుక్రుడు బుధక్షేత్రమందుండి బుధుడు కేంద్రమందుండిన దేహదుర్గంధము.

51 మేషగే చంద్రేంగే దేహే దౌర్గంధ్యం.

లగ్నమందుగాని మేషమందుగాని చంద్రుండిన దేహదుర్గంధము.

52 లగ్నేశేంత్యే పాపయుతదృష్టే యష్ట్యాచలతి.

లగ్నాధిపతి 12 యందుండి పాపులతోగూడిగాని చూడబడిగాని వుండిన కర్రసహాయముగా నడచును.

53 చంద్రజ్ఞౌ భౌమదృష్టౌ నిలజ్జః.

చంద్రబుధులు కుజునిచే జూడబడిరేని లజ్జావిహీనుడగును.

54 క్షీణేందా సౌరే త్రికే విలజ్జః.

క్షీణచంద్రుడు శనియును 6-12 స్థానములందుండిన లజ్జాహీనుడగును.

55 జ్ఞా చ్ఛావంగే భౌమేస్తే విలజ్జక.

లగ్నమందు బుధశుక్రులుండిన కుజుడు సప్తమమందుండిన లజ్జావిహీనుడు.

56 జీవేంగే భౌమదృష్టే విలజ్జక.

లగ్నమందు గురుడుండి కుజునిచే చూడబడిన సిగ్గులేనివాడు.

57 చంద్రారౌ ద్యూనే గురుదృష్టౌ సలజ్జః.

చంద్రకుజులు 7 యందుండి గురునిచే చూడబడిన లజ్జగలవాడు.

58 జ్ఞారయోగే కపటీ.

బుధకుజులు కూడియుండిన కపటము గలవాడగును.

59 పాపాన్వితేజ్ఞే బలాఢ్యంకే కపటీ.

బుధుడు పాపులతోఁగూడి బలవంతుడై 9 యందుండిన కపటియగును.

60 సోత్థేకుజే శుభదృష్టిహీనే కపటీ.

కుజుడు 3 యందుండి శుభగ్రహదృష్టిలేకుండిన కపటియగును.

61 సుఖే శేవా భాగ్యేశే షష్టే కపటీ.

భాగ్యరాజ్యాధిపతులిద్దరును 6 యందుండిన కపటియగును.

62 మేషేజ్ఞే కపటీ.

మేషమందు బుధుడుండిన కపటియగును.

63 పాపయుతేవా పాపదృష్టే సుఖే కపటీ.

రాజ్యస్థానమందు పాపులుండిగాని చూచిగాని వుండిన కపటియగును.

64 పాపాంతరే తుర్యేకపటీ.

వ్యయస్థానము పాపగ్రహమధ్యమందుండిన కపటియగును.

65 కర్మేశేవా రంధ్రేశే సుఖే కపటీ.

రాజ్యాధిపతిగాని అష్టమాధిపతిగాని 10 యందుండిన కపటియగును.

66 శన్యారతమోన్యతమే పాతాళే హృత్కపటీ.

శని, కుజ, రాహులుగాక తక్కినగ్రహములు 4 యందుండిన హృదయమునందు కపటము.

67 రాహుయమం హారయోగే హృత్కపటీ.

రాహు, శని కుజులు కూడియుండిన కపటహృదయము.

68 సుఖే స్వర్క్షే ఉచ్చగే శుభే నిష్కపటీ.

శుభగ్రహములు రాజ్య, స్వక్షేత్ర, ఉచ్చస్థానములందుండిన నిష్కపటియగును.

69 సుఖేశే బలాఢ్యే నిష్కపటీ.

రాజ్యాధిపతి బలవంతుడై యుండిన కపటము లేనివాడగును.

70 తుర్యేశుభర్క్షే మిత్రాన్వితదృష్టే నిష్కపటీ.

వ్యయస్థానము శుభక్షేత్రమై మిత్రగ్రహములతో గూడిగాని చూడబడిగాని వున్నయెడల కపటములేనివాడగును.

71 హృదయేశే గోపురాద్యాంశే నిష్కపటీ.

చతుర్థమందు గోపురాద్యంశలను పొందియున్న గ్రహముండిన నిష్కపటియగును.

72 పాతాళే మృద్వంశాదియుతే నిష్కపటీ.

చతుర్థమందు షష్ఠ్యంశలలో మృద్వంశాద్యంశలనుపొందిన గ్రహముండిన నిష్కపటీ.

73 లగ్నేశేంబుగే శుభయుతేక్షితే నిష్కపటీ.

లగ్నాధిపతి చతుర్థమందుండి శుభులతోగూడిగాని చూచిగాని వుండిన నిష్కపటియగును.

74. లగ్నేశే బలాఢ్యే నిష్కపటీ.

లగ్నాధిపతి బలవంతుడై యుండిన నిష్కపటియగును.

75 లగ్నపే పారావతాద్యాంశగే నిష్కపటీ.

లగ్నాధిపతి పారావతాదిఅంశలను పొందియుండిన నిష్కపటీ.

76 లగ్నేగురౌ శుక్రదృష్టే నిష్కపటీ.

లగ్నమందు గురుడుండి శుక్రునిచే చూడబడిన నిష్కపటియగును.

77 ఇంద్వర్కౌ తుర్యే క్షణమాత్రం కపటీ ఊర్ధ్వంనిష్కపటీ.

సూర్యచంద్రులు 12 యందుండిన క్షణమాత్రము కపటముండును.

78 తుర్యే తమసి పాపయుతదృష్టే బహిశ్శుద్ధోంతఃకపటి.

రాహువు వ్యయమందు పాపులతో కలశిగాని చూడబడిగాని యుండిన హృదయమున కపటముగలిగి పయికి మంచిగానుండును.

79 తుర్యే బహుపాపయుతేదృష్టే బహిశ్శుద్ధోంతఃకపటి.

వ్యయమందు పాపగ్రహములుండిగాని చూడబడిగాని యుండిన హృదయమున కపటముగలిగి పయికి మంచివానివలె నుండును.

80 రాత్రౌ బల్యారేంగే స్వేవా శూరః.

రాత్రిబలవంతుడయ్యు కుజుడు లగ్నమందుగాని స్వక్షేత్రమందుగాని యుండిన శూరుడగును.

81 భౌమే స్తే బలవతి శూరశ్చ.

కుజుడు సప్తమందు బలవంతుడై యుండిన శూరుడగును.

82 నిర్బలారేణాంగే దృష్టే కాతరః.

కుజుడు బలహీనుడై లగ్నమందుండిగాని చూచిగాని వుండిన భయస్తుడగును.

83 రాత్రౌ శనౌ దశమే కాతరః.

రాత్రియందు జననమై శనిదశమమందుండిన భయముగలవాడగును.

84 స్వర్క్షగే భౌమదృష్టేంగే కాతరః.

స్వక్షేత్రమును పొందియున్న కుజుడు లగ్నమును చూచుచున్న భయస్తుడగును.

85 అంశాద్విక్రమే పాపే శూరః శుభే కాతరః.

అంశలగ్నమునకు 3 ట పాపులుండిన శూరుడగును. శుభులుండిన భయముగల్గును.

86 దివాబల్యారే స్వేంగే క్రోధీ॥

పగటియందు బలవంతుడైన కుజుడు స్వక్షేత్రమందుగాని లగ్నమందుగాని వుండిన క్రోధము గలవాడగును.

87 లగ్నే స్తేవా నిర్బలారే శనిదృష్టే క్రోధీ॥

లగ్నమందుగాని సప్తమమందుగాని నిర్బలుడయ్యు కుజుడుండి శని చేతచూడబడుచున్న యెడల క్రోధియగును.

88 లగ్నే భౌమే క్రోధీ॥

కుజుడు లగ్నమందుండిన క్రోధియగును.

89 ద్యూనే బలవతి భౌమే క్రోధీ॥

కుజుడు బలవంతుడై సప్తమమందుండిన క్రోధియగును.

90 త్రికోణేల్పవీర్యే రాశీశే క్రోధి॥

5-9 రాస్యధిపతులు బలహీనులై ఆస్థానములందుండిన క్రోధియగును.

91 అంత్యాష్టమేంగేశే క్రోధి.

లగ్నాధిపతి 12-8 స్థానములందుండిన క్రోధియగును.

92 ధనేశే గుళికాన్వితే క్రోధి॥

ద్వితీయాధిపతి గుళికునితో కూడినయెడల క్రోధియగును.

93 కేతుయుతే సోత్థే కలహప్రియః॥

తృతీయస్థానమందు కేతువున్నయెడల కలహప్రియుడగును.

94 కర్కాళిఝషేర్కే భౌమదృష్టే క్షమావాన్॥

సూర్యుడు కర్కట, వృశ్చిక, మీనములందుండి కుజునిచే చూడబడిన శాంతము గలవాడగును.

95 తుర్యేశేంగేవా లగ్నేశే తుర్యే క్షమావాన్.

వ్యయాధిపతి లగ్నమందైనను లగ్నాధిపతి వ్యయమందైన నుండిన శాంతుడగును.

96 సబలే తుర్యే క్షమావాన్.

వ్యయస్థానమందు బలవంతమయిన్న గ్రహములుండిన శాంతుడు.

97 శుభేతుర్యే క్షమావాన్.

వ్యయమందు శుభగ్రహములుండిన శాంతము గలవాడగును.

98 శనిగృహే జ్ఞారౌ హాస్యాసక్తః.

శనిక్షేత్రమందు బుధకుజులుండిన హాస్యప్రలాపకుడగును.

99 జ్ఞేంగేచ అస్తేజీవో హాస్యాసక్తః

లగ్నమందు బుధుడున్ను సప్తమమందు గురుడుండిన హాస్యప్రలాపము గల్గును.

100 జ్ఞాంశేంగే హాస్యాసక్తః.

లగ్నము బుధనవాంశరాశి అయ్యినయెడల హాస్యమందాసక్తిగలవాడగును.

101 సోద్ధేభామే జ్ఞచంద్రదృష్టే ద్రోహీ.

కుజుడు భాత్రుస్థానమందుండి బుధచంద్రులు చూచుచుండిన ద్రోహియగును.

102 లగ్నేశేజ్ఞే షష్టేద్రోహి.

లగ్నాధిపతి బుధుడై షష్టమమందుండిన ద్రోహియగును.

103 రాహ్వర్కజౌ ధర్మేంశాద్గురుద్రోహి.

శని రాహులు నవాంశయందు 9 ట నుండిన గురుద్రోహియగును.

104 లగ్నేశే నిర్బలే ద్రోహి.

లగ్నాధిపతి బలహీనుడై యుండిన ద్రోహియగును.

105 అంశే కేతౌ చోరః.

అంశలగ్నమందు కేతువుండిన చోరుడగును.

106 అంశే గుళికే చోరః.

అంశలగ్నమందు గుళికుడుండిన చోరుడగును.

107 తృతీయేంత్యేశే చోరః.

వ్యయాధిపతి తృతీయమందుండిన చోరుడగును.

108 సుఖేశే షష్టే చోరః.

రాజ్యాధిపతి షష్టమమందుండిన చోరుడగును.

109 ధనే రంధ్రేశే చోరః.

అష్టమాధిపతి ద్వితీయమందుండిన చోరుడగును.

110 రిపుగే సబలౌ జ్ఞారౌ చోరః.

కుజబుధులు బలవంతులై 6 ట నుండిన చోరుడగును.

111 జ్ఞారౌ లగ్నే చోరః.

కుజబుధులు లగ్నమందుండిన చోరుడగును.

112 మృగే జీవేంగే హిబుకే నవ్యసనీ.

నిచే వ్యస॥

పతి నీచయందుండిన వ్యసనము గలవాడగును.

పే నీచే వారిక్షేత్రే వ్యసనీ॥

ధిపతి నీచయందుగాని శత్రుక్షేత్రమందుగాని వుండిన వ్యసనము

ను.

వ్యయేపాపే వ్యసనీ॥

వ్యయమందు పాపగ్రహములుండిన వ్యసనము గలవాడగును.

116 లగ్నపే నిర్బలే వ్యసనీ"

లగ్నాధిపతి బలహీనుడయిని వ్యసనము గలవాడగును.

117 లగ్నపే సారే వ్యసనీ"

లగ్నాధిపతి కుజునితో కూడిన యెడల వ్యసనము గలవాడగును.

118 అంగే పాపదృష్ట్యాధిక్యే వ్యసనీ॥

లగ్నమునకు పాపగ్రహదృష్టి అధికముగానుండిన వ్యసనముగలవాడగును.

119 సబలేంగేశే నిర్వ్యసనీ॥

లగ్నాధిపతి బలవంతుడైన వ్యసనము లేనివాడగును.

120 లగ్నేశే లగ్నేవా వ్యయే శుభసంబంధే నిర్వ్యసనీ॥

లగ్నాధిపతి లగ్నమందైనా వ్యయమందు శుభగ్రహసంబంధముండిన యెడల వ్యసనము లేనివాడగును.

121 ధర్మేశుభే నిర్వ్యసనీ॥

9 వస్థానమందు శుభగ్రహములుండిన వ్యసనములేనివాడు.

122 లగ్నపే కేంద్రే నిర్వ్యసనీ।

లగ్నాధిపతి కేంద్రమందుండిన వ్యసనములేనివాడు.

123 అంశాత్ ఖే జీవార్కమాత్రదృష్టే గోపాలః॥

అంశలగ్నమునుంచి 10 వస్థానమును రవిగురులుమాత్రచుండినయెడల గోవులను కాచేవాడగును.

ంశలగ్నము మొదలు 9ట ర.

గును.

125 ఉచ్చగేవా నీచగే శుక్రే సింహపూర్వార్ధే త్రికే కా

శుక్రుడు ఉచ్చయందుగాని నీచయందుగాని వుండి
ర్ధమందుగాని 6-12 స్థానములయందుగాని వుండిన కామకుడగును.

126 స్వాంశే శుక్రే కామీ॥

శుక్రుడు స్వకీయాంశయందుండిన కామకుడగును.

127 పాపదృష్టే శుక్రే కామీ॥

శుక్రుడు పాపగ్రహములచేత చూడబడుచున్నయెడల గామకుడగు

128 యుగ్మే స్వర్క్షేవా శుక్రే కామీ॥

శుక్రుడు మిథునమందుగాని స్వక్షేత్రమందుగాని యుండిన కామి
యగును.

129 స్వాంగనుతేషు ధనేశే కామీ.

ధనాధిపతి స్వక్షేత్ర లగ్న పంచమములందుండిన కామకుడగును.

130 శనిర్ధనుషి వృషే ల్పకామః.

శని ధనస్సునందుగాని వృషభమందుగాని యుండిన అల్పకామకుడు.

131 శుక్రే స్తే తికాముకః.

శుక్రుడు సప్తమమందుండిన అతికామకుడగును.

132 భౌమాచ్ఛయుతే జీవే చారీశే కామాధిక్యం.

గురుడుగాని షష్టమాధిపతిగాని కుజశుక్రులతో కూడియుండిన
కామాధిక్యం.

133 విషమోదయగే శుక్రే ల్పవీర్యః.

శుక్రుడు పృష్టోదయరాసులను పొందియున్న అల్పవీర్యముగలవాడు.

శుర్యే చంద్రశనీ అల్పవీర్యః.

యమందు చంద్రశనులుండిన అల్పవీర్యము గలవాడు.

క్రే స్తే అంగేశదృష్టే ల్పవీర్యః.

7 యందుండి లగ్నాధిపతిచే చూడబడిన అల్పవీర్యము

136 శుక్రక్షేత్రే చంద్రే ల్పవీర్యః.

శుక్రక్షేత్రమందు చంద్రుడుండిన అల్పవీర్యవంతుడు.

137 మందాచ్ఛౌఖే రంధ్రేవా శుభదృష్టిరాహిత్యే షండః.

శనిశుక్రులు 10 యందుగాని 8 యందుగాని వుండి శుభగ్రహదృష్టి లేకయుండిన నపుంసకుడగును.

138 షష్టాంత్యే జలక్షేత్రే మందే శుభదృష్టిహీనే షండః.

6—12 స్థానములందున్న జలరాశియందున్న శనియుండి శుభదృష్టి లేకయుండిన నపుంసకుడగును.

139 మందార్కౌ వా మందక్షేత్రేవా భౌమార్కౌ యుగ్మౌ
జక్షగా వన్యోన్యం పశ్యేత షండః.

శనిసూర్యులు శనిక్షేత్రమందైనను కుజసూర్యులుమిథునమేషములందైన నుండి ఒకరినొకరు చూచుచుండిన నపుంసకుడగును.

140 ఓజక్షేంగే సమక్షగభౌమేక్షితౌ షండః.

లగ్నము బేసి రాసియై సమరాసియందున్న కుజునిచేత జూడబడుచుండిన నపుంసకుడగును.

141 చంద్రజ్ఞౌ యుగ్మౌజక్షగౌ భౌమేక్షితౌ షండః.

చంద్రబుధులు బేసిసమరాసులయందుండి కుజునిచేత చూడబడుచుండిన నపుంసకుడగును.

142 పుంభాగే సితేందులగ్నాని షండః.

శుక్ర చంద్ర లగ్నములు పురుషరాశియందుండిన నపుంసకుడు.

143 మంధాచ్ఛౌఖే షండః.

శనిశుక్రులు దశమమందుండిన నపుంసకుడగును.

144 శుక్రాత్ షష్ఠే అష్టమే మందే షండోవా తాదృశః.

శుక్రుడుండిన స్థానము మొదలు 6—8 యందు శనియుండిన నపుంసకుడుగాని అటువంటివాడుగాని అగును.

145 అంశే కేతౌ మందజ్ఞదృష్టే షండః.

నవాంశయందు కేతువు శనిబుధులచేజూడబడిన నపుంసకుడు.

146 మందార్కౌ శుభదృష్టిహీనౌ రంధ్రగౌ షండః.

శనిశుక్రులు శుభగ్రహదృష్టిలేక అష్టమమందుండిన నపుంసకుడు.

147 షష్ఠాంత్యే నీచగే మందే షండః.

6_12 స్థానములందు నీచనుపొందిన శనియుండిన నపుంసకుడగును.

148 రాహౌ శుక్రేర్కజే వోచ్చగే కర్కేర్కే మేషే చంద్రే వీర్యచ్యుతిః.

రాహు, శుక్ర, శనులలో నొకరయిన ఉచ్చయందుండి రవి కర్కాట మందుండి మేషమందు చంద్రుడుండిన వీర్యనష్టము గలుగును.

149 లగ్నే చంద్రే గుర్వర్కజౌ సుతే వీర్యచ్యుతిః.

లగ్నమందు చంద్రుడుపంచమమందు గురుశనులు వుండిన వీర్యస్ఖలనము.

150 కన్యోదయే మందజ్ఞదృష్టే మందక్షేత్రే శుక్రే వీర్యచ్యుతిః.

కన్యాలగ్నమును శనిబుధులుచూచుచుండి శనిక్షేత్రమందు శుక్రుడుండిన వీర్యస్ఖలన మగుచుండును.

151 ఈజ్యేంగే కుజేస్తే ఉన్మాదీ.

లగ్నమందు గురుడున్న సప్తమమందు కుజుడుండిన పిచ్చవాడగును.

152 లగ్నేశనౌ మందాత్త్రికే కుజే ఉన్మాదీ.

లగ్నమందుశనియుండి ఆశనికి 6_8_12 యందు కుజుడుండిన ఉన్మాది.

153 మందేంగే వ్యయర్కే కోణేచంద్రే వా భౌమే ఉన్మాదీ.

లగ్నమందుశని వ్యయమందు రవి 9_5లో చంద్రుడుగాని కుజుడుగాని వుండిన ఉన్మాదము గలవాడగును.

154 మూఢే నీచే షష్ఠేసోత్థేశే పాపదృష్టే గరళజఉన్మాదీ.

భ్రాతృస్థానాధిపతి మూఢనీచలనుపొంది షష్ఠమమందుండి పాపులచేత జూడబడిన గరళమువల్ల కల్గిన ఉన్మాదము గలవాడగును.

155 భౌమేస్తే జీవేంగే ఉన్మాదీ.

కుజుడు సప్తమమందున్న గురుడులగ్నమందును వుండిన ఉన్మాదియగును.

156 క్షీణేంద్వర్కజానస్తే ఉన్మాదీ.

సప్తమమందు క్షీణచంద్రుడు శనియుండిన ఉన్మాదియగును.

157 మందార్థేశౌ సపాపౌ వాతజ ఉన్మాదః.

శనియును ధనాధిపతియును పాపులతో కూడియుండిన వాతమువలన పిచ్చిగల్గును.

158 ధనేశార్కజౌ సూర్యయుతౌ రాజకోపజోన్మాదః
శనియు, ధనాధిపతియు, సూర్యునితో కూడియుండిన రాజకోపము వలన పిచ్చి గల్గును.

159 యమార్థేశౌ భౌమయుతౌ పిత్తజ ఉన్మాదః.
శనిధనాధిపతులు కుజునితోకూడిన పైత్యమువల్ల ఉన్మాదముగలుగును.

160 చంద్రార్కౌ కోణాంగగౌ కేంద్రే జీవో యమారశశివారేషూన్మాదః॥
సూర్యచంద్రులు 1—5—9 యందుండి గురుడు కేంద్రమందుండిన శని కుజసోమవారములయం దున్మాదము గలుగును.

161 ఇంద్వర్కజౌ లగ్నగ జ్ఞదృష్టౌ విహ్వలః
సూర్యచంద్రులు లగ్నగతులై బుధునిచేచూడబడిన చంచలబుద్ధి గల్గును.

162 ధనే కేతౌ శీఘ్రం వార్ధక్యచిహ్నోదయః॥
ధనస్థానమందు కేతువుండిన శీఘ్రకాలములో వార్ధక్యచిహ్నములు గలుగును.

163 రాహ్వర్కజార్కేజ్యా లగ్నగా ప్రకృతివృద్ధః॥
రాహు, శని, సూర్య, గురులు, లగ్నగతులయ్యిన స్వభావముచేత వృద్ధుడు.

164 చంద్రాచ్చౌ లగ్నే నాతివృద్ధో నయువా॥
చంద్రశుక్రులు లగ్నమందుండిన వృద్ధుగాక యవ్వనుడుగాకయుండును.

165 సబలేభౌమే లాభే వృద్ధోపి తరుణాయతే॥
కుజుడు బలవంతుడై లాభమందుండిన వృద్ధులయ్యినను బలశాలియై యుండును.

166 ఖేశుఖేశే రసాయనవ్యసనీ॥
చతుర్థాధిపతి దశమమందుండిన రసాయనములందు వ్యసనముగల్గును.

167 సుఖేశేవిబలే రసాయనవ్యసనీ॥
చతుర్థాధిపతి బలహీనుడయ్యిన రసాయనములందు వ్యసనముగల్గును.

168 సపాపేర్థేశే బహుభుక్॥

ధనాధిపతి పాపులతోకూడిన అమితభోజనము గలవాడగును.

169 సపాపేర్థే క్రూరషష్ట్యంశే బహుభుక్॥

ధనస్థానమందు పాపగ్రహములుండి క్రూరషష్ట్యంశలందుండిన అమిత భోజి.

170 సశుభే ధనేశే సుఖభుక్॥

ధనాధిపతి శుభులతోగూడిన సుఖభోజనము చేయును.

171 ధనేశుభె పాపదృష్టిహీనే సుఖభుక్॥

ధనస్థానమందు శుభగ్రహములుండి పాపదృష్టిలేకుండిన సుఖభోజి.

172 ధనే శుభదృష్ట్యాధిక్యే సుఖభుక్॥

ధనస్థానమందు శుభదృష్టి యెక్కువగానుండిన సుఖభోజి.

173 ధనేశే బలవతి సుఖభోజీ॥

ధనాధిపతి బలవంతుడై యుండిన సుఖభోజి యగును.

174 వైశేషికాంశేర్థేశేవా గురుదృష్టే సుఖభోజీ॥

ధనాధిపతి వైశేషికాంశయందుండి గురుదృష్టిగలిగిన సుఖభోజి.

175 ధనేశే మందే నీచగే గులికయుతే సతతం శ్రాద్ధభోజీ॥

శని ధనాధిపతియై నీచనుపొందిన గులికునితో కూడినను యెల్లప్పుడు శ్రాద్ధభోజి.

176 ధనేశే శుభెవా స్వోచ్చే శుభదృష్టే ల్పాసీ॥

ధనాధిపతి శుభుడై భాగ్యమందుగాని స్వక్షేత్రోచ్చలయందుండి శుభదృష్టి గలిగి యుండిన అల్పభోజియగును.

177 సబలేర్థేశే సశుభే శీఘ్రభుక్॥

ధనాధిపతి బలవంతుడై శుభులతో గూడిన శీఘ్రభోజి.

178 ధనేశే చరభే శీఘ్రభుక్.

ధనాధిపతి చరలగ్నమందుండిన శీఘ్రభోజియగును.

179 ధనేశుభక్షేత్రే శుభదృష్టే శీఘ్రభుక్.

ధనస్థానము శుభక్షేత్రమై శుభులచేచూడబడిన శీఘ్రభోజి.

180 క్రోశేపాపక్షేత్రే పాయుతేదృష్టే చిరభుక్.

ధనస్థానము పాపక్షేత్రమై పాపులతో గూడిగాని చూచిగాని వుండిన ఆలస్యభోజి.

181 ధనేశే స్థిరక్షే చిరభుక్.

ధనాధిపతి స్థిర రాసియందుండిన చిరకాలభోజియగును.

182 గుళికారయోగే కదన్నభుక్.

గుళికకుజులు కలశియుండిన కుచ్ఛితాన్నభోజియగును.

183 లగ్నే జీవో భోజనశూరః.

లగ్నమందు గురుడుండిన భోజనశూరుడగును.

184 భ్రాతృపే బలిని కేంద్రకోణగే సౌమ్యదృష్టే.

వైశేషికాంశే ధీరః.

తృతీయాధిపతి బలవంతుడై కేంద్రకోణములందుండి శుభగ్రహములచే చూడబడి వైశేషికాంశయందుండిన ధీరుడగును.

185 విక్రమేశే శుభక్షే-శాంశే శుభదృష్టయుతే ధీరః.

భ్రాతృస్థానాధిపతి శుభక్షేత్రాధిపతియొక్క అంశయందుండి శుభగ్రహదృష్టి గలిగియుండిన ధీరుడగును.

186 విక్రమేశార్క-యోగే ధీరః.

భ్రాతృస్థానాధిపతియు సూర్యుడున్ను కూడియుండిన ధీరుడగును.

187 సోత్థేసేందుయోగే ధీరః.

భ్రాతృస్థానాధిపతి చంద్రునితో కూడినయెడల ధీరుడగును.

188 సుతేంగేశే పిశునః.

లగ్నాధిపతి పంచమమందుండిన లోభియగును.

189 పాపేంగేశే పిశునః.

లగ్నాధిపతి పాపులతో కలశిన లోభియగును.

190 పాపదృష్టాధిక్యేంగే పిశునః.

లగ్నము పాపదృష్ట్యాధిక్యముగనుండిన లోభియగును.

191 పాపదృష్టే జీవే సతమసి చాండాలతా.

గురుడు పాపదృష్టిగలిగి రాహువుతో కూడియుండిన ఛండాలత్వము.

192 నీచభాంశేజీవే చాండాలతా.

గురుడు నీచక్షేత్రాంశయందుండిన చండాలత్వము.

193 గ్రస్తిచంద్రేంగే పాపాకోణే పిశాచాజనిః.

చంద్రుడు రాహుగ్రస్తుడై లగ్నమందుండి పాపగ్రహములు కోణమందుండిన పైశాచగ్రస్తుడగును.

194 కేంద్రేమందే జ్ఞయుతే సిల్పీ.

శని కేంద్రమందుండి బుధునితో కూడియుండిన శిల్పకారకుడగును.

195 సబలే జ్ఞె కేంద్రే శిల్పీ.

బుధుడు బలవంతుడై కేంద్రమందుండిన శిల్పకారకుడగును.

196 ఇజ్యజ్ఞయోగే శిల్పీ.

గురుబుధుల సంయోగము గలిగిన శిల్పకారకుడగును.

197 జ్ఞేజ్యౌ త్రికే ఉపదేశప్రియః.

బుధగురులు 6—8—12 స్థానములందుండిన ఉపదేశప్రియుడగును.

198 షష్టేశేజీవె శుక్రేవా మధురాదిప్రియః.

గురుడుగాని శుక్రుడుగాని షష్టమాధిపతులైన మధురప్రియుడగును.

199 సశుభేజ్ఞే మధురప్రియః.

బుధుడు శుభగ్రహములతో కూడిన మధురప్రియుడగును.

200 సపాపేజ్ఞే మధురారుచిః.

బుధుడు పాపగ్రహములతో కూడిన మధురమందు ప్రియములేనివాడు.

201 లగ్నేర్కజశ్చ కేంద్రగచంద్రదృష్టే నీచకర్మ.

లగ్నమందు శనియుండి కేంద్రగతుడైన చంద్రునిచే చూడబడిన నీచకర్మ.

202 ద్యూనేర్కే లగ్నేమందే పుణ్యేసో త్థేభౌమె

శ్రేష్టవర్గోపి నీచపథగః.

సూర్యుడు 7 యందున్న శని 1యందున్న 10 యందును 3 యందును కుజుడున్న వుండిన యోగ్యమయిన కులమందు పుట్టినవాడైనను నీచుడగును.

203 మందార్కా వేకర్షగౌ త్ర్యంశె నవాంశె త్రింశాంశెవా

నీచయోషానుషంగా న్లెచ్ఛోభవతి.

శని సూర్యులు యేకరాశిగతులై త్రియంశ నవాంశ త్రింశాంశలలో దేనియందున్నను నీచస్త్రీసాంగత్యమువలన మ్లేచ్ఛుడగును.

204 షష్ఠాంగేశౌ లగ్నగౌ జ్ఞాతిపీడా.

లగ్నషష్ఠమాధిపతులు లగ్నమందుండిన జ్ఞాతులచేత బాధపడును.

205 లగ్నేశే షష్ఠే షష్ఠేశదృష్టే జ్ఞాతిపీడా.

లగ్నాధిపతి 6 ట నుండి షష్ఠమాధిపతిచే చూడబడుచున్న జ్ఞాతిపీడ గలుగును.

206 శుక్రేజ్యౌ లగ్నే షష్ఠేశయుతౌ శన్యారతమోదృష్టౌ జ్ఞాతిపీడా.

లగ్నమందు గురుశుక్రులుండి షష్ఠాధిపతితో కూడి శని కుజ రాహువు లచేత జూడబడిన జ్ఞాతివర్గమువలన బాధింపబడినవాడగును.

207 లగ్నేశాద్వా లగ్నాత్త్రిక్రగ్రై: పాపై ర్జాతిచ్యుతి:॥

పాపగ్రహములు లగ్నాధిపతినుండిగాని లగ్నమునుండిగాని 6-8-12 స్థానములను పొందియుండిన వర్ణభ్రష్టుఅగును.

208 క్షేంద్వర్కజా నీచారిభాగగా జాతిచ్యుతి:॥

శని, బుధ, చంద్రులు నీచశత్రుస్థానములందుండిన వర్ణభ్రష్టు.

209 ఇంద్వర్కజౌ మిత్రక్షే జాతిపోష్య:॥

శని చంద్రులు మిత్రక్షేత్రమందుండిన బంధుపోషకుడగును.

210 లాభేశేంగే కౌతుకీ॥

లాభాధిపతి లగ్నమందుండిన ఉత్సాహము గలవాడగును.

211 లాభేశే శుభేవా సబలే కౌతుకీ॥

లాభాధిపతి బలవంతుడై 9 యందుండిన ఉత్సాహము గలవాడగును.

212 లాభేశుభే కౌతుకీ॥

లాభమందు శుభగ్రహములుండిన ఉత్సాహము గలవాడగును.

213 ఇజ్యమందయోగే అలస:॥

గురు శనులు గూడియుండిన మందబుద్ధిగలవాడగును.

214 లగ్నేశే మందాన్వితే అలస:॥

లగ్నాధిపతి శనితో గూడిన మందబుద్ధియగును.

215 లగ్నేశే నిర్బలే అలస:॥

లగ్నాధిపతి బలహీనుడౌనేని మందబుద్ధియగును.

216 లగ్నే పాపదృష్ట్యాధిక్యే అలస:॥

లగ్నమందు పాపదృష్టిగలిగియుండిన మందబుద్ధియగును.

217 అంశాద్ధర్మే జీవే కృషికర్తా॥

నవాంశయందు భాగ్యమందు గురుఁడుండిన వ్యవసాయముచేయును.

218 అంశాదరిగే పాపైః కృషికర్తా.

పాపగ్రహములు నవాంశయందు శత్రుక్షేత్రమందుండిన వ్యవసాయము చేయును.

219 ధనుషి వృషేంగే క్రూరైర్దృష్టే ఖల్వాటః॥

ధనస్సు, వృషభము, లగ్నమున్ను పాపగ్రహములతో గూడిగాని చూడబడినగాని దుర్వృత్తిగలవాడగును.

220 సపాపే పాపర్క్షేంగే ఖల్వాటః॥

లగ్నము పాపక్షేత్రమై పాపగ్రహములతో కూడియుండిన దుర్వృత్తి గలుగును.

221 కర్కటే చంద్రే భౌమదృష్టే సింహాచాపాళ్యంగనాలగ్నే ఖల్వాటః॥

కర్కటమందుగాని సింహ, ధను, వృశ్చిక, కన్య, లగ్నములయందు చంద్రుడుండి కుజునిచే చూడబడిన దుర్వృత్తి గలవాడగును.

222 నేత్రే శుభ నేత్రేశేచ శుభాన్వితేంగేశయుతే శోభననేత్రః॥

ద్వితీయస్థానమందు శుభగ్రహములున్ను ద్వితీయాధిపతియును వుండియుగాని ద్వితీయాధిపతి శుభగ్రహములతో కూడిగాని యుండిన విశాలమున్ను శోభననేత్రములు గలవాడగును.

223 ఇనద్వరాకే లగ్నే మిశ్రదృష్టే బుద్బుదలోచనః.

సూర్యచంద్రులు లగ్నమందుండి శుభపాపగ్రహ మిశ్రదృష్టి గలిగియుండిన నీటిబుడగలవంటి నేత్రములు గలవాడగును.

224 ధనేవా వ్యయె పాపె మీలితాక్షః.

ద్వితీయమందుగాని వ్యయమందుగాని పాపులుండిన నిమీలననేత్రుడు.

225 సక్రూరే ర్కే త్యేవా త్రికోణే వికలనయనః.

సూర్యుడు క్రూరగ్రహములతో కూడి వ్యయమందుగాని 5—9 యందుగాని వుండిన వికలమయిన నేత్రములు గలవాడగును.

226 ధనేవా వ్యయె శుక్రె పాపయుతె కాణోవా మందలోచనః.

శుక్రుడు ధనమందుగాని వ్యయమందుగాని పాపగ్రహములతో కూడి యుండిన జాత్యంధుడుగాని మందదృష్టిగలవాడుగాని యగును.

227 పుష్పవంతౌ వసద్దృష్టౌ వక్రగక్షే గౌవా త్రికే వక్రనేత్రః.

సూర్యచంద్రులు వక్రగతులైనపాపగ్రహములచే చూడబడిగాని 6-8-12 స్థానములందుండినగాని వక్రమయినేత్రములు గల్గును.

228 చంద్రారా వేకభాగే అక్షిణోశ్చిహ్నం.

చంద్రకుజులు యేకరాశిగతులై యుండిన నేత్రములందు పుట్టి మచ్చ లుండును.

229 షష్ఠేశే వక్రగక్షే అక్షిరోగీ.

షష్ఠమాధిపతి వక్రగతుడైయుండిన నేత్రరోగము గలవాడగును.

230 జ్ఞారక్షే లగ్నపే జ్ఞారదృష్టే అక్షిరోగీ.

లగ్నాధిపతి బుధకుజక్షేత్రములందుండి బుధకుజదృష్టి గలిగియుండిన నేత్ర రోగము గలవాడగును.

231 రంధ్రాంగేశౌ షష్ఠే సవ్యనేత్రే రోగః.

లగ్నాష్టమాధిపతులు షష్ఠమమందుండిన కుడినేత్రమందు రోగముగల్గును.

232 షష్ఠేష్టమే శుక్రే దక్షిణనేత్రరోగః.

శుక్రుడు 6-8 యందుండిన దక్షిణనేత్రమందు రోగముగల్గును.

233 ధనేశే శుభేక్షితే లగ్నేశే పాపయుతే సరోగనేత్రః.

ధనాధిపతి శుభులచేచూడబడి లగ్నాధిపతి పాపులతో కూడిన నేత్రరోగీ.

234 మందారగులికయుతే నేత్రేశే నేత్రేరోగః.

ద్వితీయాధిపతి శనికుజగులికులతో కూడిన నేత్రరోగము.

235 నేత్రేపాపా యమదృష్టా నేత్రం రోగహతం భవేత్.

పాపగ్రహములు ద్వితీయమందుండి శనిచేచూడబడిన రోగమందు నేత్రము పోవును.

236 నేత్రాంశేశే పాపక్షే రోగహతనేత్రః.

ద్వితీయనవాంశాధిపతి పాపక్షేత్రమందుండిన రోగమున నేత్రముపోవును.

237 లగ్నాష్టమే శుక్రే క్రూరదృష్టే అశ్రుపాతా న్నేత్రపీడా.

శుక్రుడు 1–8 యందుండి పాపులచేచూడబడిన నేత్రములనుండి నీరు కారును.

238 లగ్నే భౌమే శయనే నయనే గదః.

లగ్నమందు కుజుడుండిన నేత్రములకు రోగముగలుగును.

239 స్వేశశుక్రయోగే నేత్రరోగీ.

లగ్నాధిపతియును శుక్రుడును కూడియుండిన నేత్రరోగము.

240 శుక్రాత్త్రికే నేత్రేశే నేత్రరోగీ.

శుక్రునికి 6—8—12 యందు ద్వితీయాధిపతియుండిన నేత్రరోగము.

241 త్రికోణేసూర్యే పాపదృష్టే నిస్తేజోనేత్రః.

సూర్యుడు 5–9 యందుండి పాపులచే చూడబడిన తేజోహీనమైన నేత్రము.



242 లగ్నేశే సార్క–శుక్రేత్రికే జన్మాంధః.

లగ్నాధిపతి రవిశుక్రులతో కూడి 6–8–12 యందుండిన జాత్యంధుడు.

243 సూర్యే రాహుగ్రహస్తే ంగే మందారౌ త్రికోణే జన్మాంధః.

సూర్యుడు రాహుగ్రస్తుడై లగ్నమందుండి శనికుజులు 5–9యందున్న జాత్యంధుడు.

244 నేత్రాంగేశౌ భాన్వచ్ఛాయుతౌ త్రికేజన్మాంధః.

లగ్నద్వితీయాధిపతులు రవిశుక్రులతో కూడి 6–8–12 యందున్న జాత్యంధుడు.

245 త్రికేచంద్రారయోగే పాతాదంధః.

6–8–12 యందు చంద్రకుజులుండిన పడుటవలన గ్రుడ్డివాడగును.

246 నేజ్యేంద్వౌ త్రికే నేకాదంధః.

6–8–12 యందు గురునితో కూడి చంద్రుడుండిన స్నానాదులవలన గ్రుడ్డియగును.

247 చంద్రాచ్ఛౌత్రికే కామాంధః.

6–8–12 యందు చంద్రశుక్రులుండిన కామాంధుడగును.

248 జ్ఞేందుత్రికే శాస్త్రాంధః॥

6-8-12 యందు బుధచంద్రులుండిన శాస్త్రాంధుడగును.

249 ఇంద్వర్కౌ-సోఙ్గా వా కేంద్రేంధః॥

చంద్రసూర్యులు తృతీయమందుగాని కేంద్రమందుగాని వుండిన అంధుడగును.

250 పాపక్షేత్రభౌమే కేంద్రేంధః.

కుజుడు పాపక్షేత్రమందుగాని కేంద్రమందుగాని వుండిన అంధుడగును.

251 యమక్షేత్రాస్తే సూర్యేంధః.

సూర్యుడు శనిక్షేత్రమందుగాని 7 యందుగాని వుండిన అంధుడగును.

252 సౌమ్యాత్త్రికే క్రూరైర్దృష్టా అంధః.

శుభగ్రహములకు 6-8-12 యందు పాపగ్రహములుండిగాని చూచిన అంధుడు.

253 కుజేంగే కుంభేంధః.

కుజుడు లగ్నమందుగాని కుంభమందుగాని వుండిన అంధుడు.

254 శుక్రాంగేశయుతా స్వాంత్యేశౌ త్రికస్థావంధః.

లగ్నవ్యయాధిపతులు శుక్రునితో కూడి 6-8-12 యందుండిన నంధుడగును.

255 శుక్రపాపాభ్యాం యుక్తశ్చంద్రో ద్వితీయేంధః.

చంద్రుడు శుక్రునితోను పాపులతోను కూడి ద్వితీయమందుండిన అంధుడు.

256 సుతాంబుగా పాపా అంధః.

పాపగ్రహములు 4-5 యందుండిన అంధుడగును.

257 చంద్రేత్రికే పాపదృష్టేంధః.

చంద్రుడు 6-8-12 స్థానములందుండి పాపులచేచూడబడిన అంధుడగును.

258 చంద్రార్కా-వ్యయే శుభదృష్టిహీనే అంధః.

సూర్యచంద్రులు వ్యయమందుండి శుభదృష్టిలేకుండిన అంధుడగును.

259 సింహేర్కి-జేంగెవా శుక్రేంధః.

సింహమందుశనియుండి లగ్నమందుశుక్రుడుండిన అంధుడగును.

260 యమేంద్వర్కాః క్రమాదంత్యార్థనాష్టమగా నేత్రహీనః.

శని చంద్రసూర్యులు క్రమముగా 12-2-8 స్థానములందుండిన నేత్రహీనుడగును.

261 యథాతథా షష్ఠాష్టాంత్యధనస్థా శ్చంద్రార్కార
యమా బలిగ్రహా దోషజా నేత్రహీనతా.

చంద్ర. సూర్య. కుజ. శనులు యేప్రకారముగా 6-8-12-2 యీస్థాన
6 8 12 2
ములందుండునో ఆప్రకారము ఆగ్రహముల యొక్క బలదోషములవలన నేత్రహీనుడగును.

262 లగ్నాచ్ఛుక్రాద్వా సుతేరాహుః సూర్యదృష్టశ్చే న్నేత్రహానిః.

లగ్నమునుండిగాని శుక్రుడున్నస్థానమునుండిగాని 5 వస్థానమందు రాహువుండి సూర్యునిచేత చూడబడిన నేత్రహాని కలుగును.

263 మందే తుర్యే పాపైర్దృష్టే నష్టదృష్టిః.

శనివ్యయమందుండి పాపులచే చూడబడుచున్న నష్టదృష్టిగలవాడగును.

264 సేందుః శుక్రస్త్రికస్థో నిశాంధః.

శుక్రుడు చంద్రునితోగూడి 6-8-12 యందుండిన రాత్రియందు అంధుడగును.

265 శుక్రేందుయుతే నేత్రేశే అంగే నిశాంధో నతు స్వోచ్చశుభైర్యుతే.

ద్వితీయాధిపతి శుక్రచంద్రులతో గూడి లగ్నమందుండిన నిశాంధుడగును. ఆద్వితీయాధిపతి స్వక్షేత్రఉచ్చలయందుండి శుభులచే చూడబడిన అంధుడుకాడు.

266 లగ్నాద్దేశౌ త్రికే క్షినాశః.

లగ్నద్వితీయాధిపతులు 6-8-12 స్థానములందుండిన నేత్రనాశము.

267 చంద్రార్కా సింహేఽంగే శన్యారదృష్టౌ నేత్రనాశః.

సూర్యచంద్రులు సింహమందుగాని లగ్నమందుగానివుండి శనికుజులచేత చూడబడిన నేత్రములు పోవును.

268 భౌమేంత్యే వామనేత్రేఘాతః॥

వ్యయమందు కుజుడుండిన వామనేత్రమందు ఘాతముకలుగును.

269 మందేద్వే దక్షనేత్రే ఘాతః॥

ద్వితీయమందు శనియుండిన కుడినేత్రమందు ఘాతము కలుగును.

270 లగ్నేధనారికర్మేశాః శుక్రయుతా నృపకోపాన్నేత్రోత్పాటనం॥

లగ్నమందు 2-6-10 అధిపతులు శుక్రునితో కూడియుండిన రాజకోపమువలన నేత్రోత్పాటనము కలుగును.

271 అచ్ఛాక్షిపౌ నీచాంశగౌ పాపయుతౌ నృపకోపాన్నేత్రోత్పాటనం॥

శుక్ర, ద్వితీయాధిపతులు నీచాంశయందుండి పాపులతో కూడిన రాజకోపమువలన నేత్రోత్పాటనము గలుగును.

272 రాజారినాథాంశేశే త్రికే లగ్నేశయుతే నృపకో-
పాన్నేత్రోత్పాటనం॥

10—6 అధిపతుల అంశాధిపతులు 6—8—12 యందు లగ్నాధిపతితో కూడిన నృపకోపమువల్ల నేత్రోత్పాటనము.

273 శుక్రాక్షిపౌ షష్ఠగౌ శుభైర్నదృష్టౌ నేత్రప్రమాదః॥

ద్వితీయాధిప శుక్రులు 6 యందుండి శుభులచే చూడబడకుండిన నేత్రప్రమాదము.

274 లగ్నేభౌమేవా చంద్రేశుక్రేజ్యదృష్టే కాణః॥

లగ్నమందు కుజుడుగాని చంద్రుడుగాని వుండి శుక్రగురులచే చూడబడిన జాత్యంధుడు.

275 వ్యయారిగౌ చంద్రార్కౌ దంపతీకాణౌ॥

12—6 స్థానములయందు చంద్రసూర్యులుండిన దంపతులిద్దరును గ్రుడ్డివాళ్ళగుదురు.

276 సింహేచంద్రేఽస్తే భౌమదృష్టే కాణః॥

సింహమందుగాని సప్తమమందుగాని చంద్రుడుండి కుజునిదృష్టియున్న గ్రుడ్డివాడగును.

277 కర్కేఽర్కే సప్తమే భౌమదృష్టే కాణః॥

సూర్యుడు కర్కాటకమందుండి సప్తమము కుజునిచేచూడబడిన గ్రుడ్డివాడు.

278 చంద్రాచ్ఛావంత్యేవా ద్యూనేవా వామాక్ష్ణో కాణః॥

చంద్రశుక్రులు 12 యందుండిగాని 7 యందుగాని వుండిన యెడమ కన్ను గ్రుడ్డి.

279 చంద్రాత్త్రికే సౌమ్యే షష్టేశే త్రికే బధిరః॥

చంద్రునికి 12 ట బుధుడుండి షష్టాధిపతి 6—8—12 యందుండిన చెవిటివాడగును.

280 సరిపుపూర్ణేందుశుక్రౌ బధిరః॥

పూర్ణచంద్రశుక్రులు శత్రువులతో గూడిన చెవిటివాడగును.

281 రాత్రౌ జ్ఞేషష్టే సుతే శుక్రే బధిరః॥

రాత్రియందు బుధుడు షష్టమమందు శుక్రుడు పంచమమందుండిన చెవిటివాడు.

282 సితేంత్యే జ్ఞయుతే వామకర్ణశ్రుతిన్యూనతా॥

శుక్రుడు వ్యయమందునుండి బుధునితో గూడిన యెడమచెవిబధిరము.

283 జ్ఞషష్టేశౌ క్రూరయుతౌ బధిరః॥

బుధుడును 6 అధిపతియును పాపులతో కూడిన చెవిటివాడగును.

284 పాపాస్త్రయస్త్రికోణే సౌమ్యేనేక్షితా బాధిర్యకారః॥

3—6—11 అధిపతులు త్రికోణమందుండి శుభదృష్టిలేకుండిన బధిరము చేయువారు

285 షష్టేశే త్రికే మందదృష్టే బధిరః.

షష్టమాధిపతి 6—8—12 యందుండి శనిదృష్టిగలిగిన చెవిటివాడు.

286 హంసార్కిచంద్రా స్త్రిసుతా స్తధర్మగాస్సౌమ్యా దృష్టయుతా కర్ణచ్ఛేదః.

రవి, శని, చంద్రులు 3—5—7—9 స్థానములందుండి శుభదృష్టి లేక కూడకుండిన కర్ణచ్ఛేదం.

287 చంద్రాదస్తేమందే శుక్రార్కాలగ్నే కర్ణచ్ఛేదః.

చంద్రునికి 7 ట శనియుండి రవిశుక్రులులగ్నమందుండిన కర్ణచ్ఛేదము.

288 నీచేభృగౌ ఫణియుతే కర్ణచ్ఛేదః.

శుక్రుడునీచనుపొంది రాహువుతో కూడియుండిన కర్ణచ్ఛేదమగును.

289 శుక్రేషష్టే కుజేంగే నాసాచ్ఛేదః.

శుక్రుడు షష్ఠమందుండి కుజుడు లగ్నమందుండిన ముక్కు తెగిపోవును.

290 ఇంద్వచ్ఛౌ మేషగౌ లగ్నషష్ఠేజ్ఞే ముఖదౌర్గంధ్యం.

శుక్రచంద్రులు మేషమందుండి బుధుడు లగ్నమందుగాని షష్ఠమందుగాని వుండిన ముఖము దుర్గంధముగలిగి యుండును.

291 కర్కాజగే శుక్రే ముఖదౌర్గంధ్యం.

శుక్రుడు కర్కాటమేషములందుండిన ముఖదుర్గంధము గల్గును.

292 లగ్నే ఇందౌ షష్ఠేశే జ్ఞే ముఖదుర్గంధం.

లగ్నమందు చంద్రుడుండి షష్ఠమాధిపతి బుధుడైయున్న ముఖదుర్గంధము.

293 కర్కాళిఝషే జ్ఞే సూర్యాదస్తచంద్రదృష్టే మూకః.

బుధుడు కర్కాటక, వృశ్చిక, మీనములందుండి సూర్యునికి సప్తమముండిన చంద్రునిచేత చూడబడుచుండిన మూగివాడగును.

294 జ్ఞారీశౌ లగ్నగౌ మూకః.

బుధషష్ఠమాధిపతులు లగ్నమందుండిన మూగివాడగును.

295 జీవారీశామంగే మూకః.

గురుషష్ఠమాధిపతులు లగ్నమందుండిన మూగివాడగును.

296 ధనేశేజ్యౌత్రికే మూకః.

గురుద్వితీయాధిపతులు 6—8—12 యందుండిన మూగివాడగును.

297 కర్కాళిఝషగే జ్ఞే చంద్రదృష్టే సుఖేసూర్యే షష్ఠమే
పాపదృష్టే గుంగస్వరః.

బుధుడు కర్కాటకవృశ్చికమీనములందుండి చంద్రునిచేత చూడబడి దశమమందు సూర్యుడుండి 6 ట పాపదృష్టిగలిగిన బొంగుస్వరము గలవాడగును.

298 శుక్రేంద్వారావంగే గుంగస్వరః.

శుక్రచంద్రకుజులు లగ్నమందుండిన బొంగుస్వరము గల్గును.

299 చంద్రార్కామీనస్థౌ ప్రహసితముఖః.

రవిచంద్రులు మీనమందుండిన నవ్వుగల ముఖముగలిగి యుండును.

300 ధనేశే స్వోచ్చగే కేంద్రే ప్రహాశితముఖీ.

ధనాధిపతి స్వక్షేత్రఉచ్చలయందుండి కేంద్రమందుండిన నవ్వుచున్న ముఖము గలుగును.

301 కోణేశే సౌమ్యయుతే కేంద్రే సుముఖః.

ధనాధిపతి శుభగ్రహములతో గూడి కేంద్రములందుండిన యోగ్యమయిన ముఖముగలుగును.

302 ధనే పాపే ధనేశే పాపయుతే నీచారిగే దుర్ముఖః.

ద్వితీయమందు పాపగ్రహములుండి ద్వితీయాధిపతి పాపులతో గూడి నీచశత్రుస్థానములందుండిన వికారముఖము గలవాడగును.

303 ధనే పాపే దీర్ఘముఖః.

ద్వితీయమందు పాపగ్రహములుండిన పొడవుపాటి ముఖముగల్గును.

304 జామిత్రే మందే చంద్రే స్వే వాంగ్మీ.

శనిసప్తమమందుండి చంద్రుడు స్వక్షేత్రమందుండిన మాటలయందు నేర్పరి.

305 దివా సింహే జ్ఞే వాంగ్మీ.

పగటియందు సింహమందు బుధుడుండిన వాక్యనిపుణుడగును.

306 మందాచ్ఛౌ విత్తే మందభే ర్కే వాంగ్మీ॥

ధనస్థానమందు శనిశుక్రులుండి శనిక్షేత్రమందు సూర్యుడుండిన వాంగ్నిపుణుడు

307 రాత్రౌ కర్కే జ్ఞే వాంగ్మీ.

రాత్రియందు కర్కటమందు బుధుడుండిన వాంగ్నిపుణుడు.

308 ధనేశే సౌమ్యయుతే కేంద్రకోణే వా శుభేక్షితే పుంగ్రహయోగే వాంగ్మీ.

ధనాధిపతి శుభగ్రహములతో గూడి కేంద్రకోణములందుండి శుభగ్రహములచేతను చూడబడి పురుషగ్రహసంయోగముగలిగిన వాంగ్నిపుణుడు.

309 ధనేశే పారావతాంశే వాంగ్నిపుణః.

ధనాధిపతి పారావతాంశయందుండిన వాంగ్నిపుణుడగును.

310 సౌమ్యాంశే జీవే వాంగ్నిపుణః.

గురుడు శుభాంశలయందుండిన వాంగ్నిపుణుడు.

311 వాగీశాంశపే ఉచ్చే గోపురే వా వాంగ్నిపుణః.

ధనాధిపతి యొక అంశాధిపతి ఉచ్చగోపురాంశలందుండిన వాంగ్నిపుణుడు.

312 సశుభే జీవే వర్గోత్తమే వాంగ్నిపుణః.

గురుడుశుభులతో గూడి వర్గోత్తమాంశయందుండిన వాంగ్నిపుణుడు.